దాభవ ॥ నమస్కారః ॥ యస్య స్మృత్యాచనామోక్త్యాతపఃపూజాక్రియ ఋషు । న్యూనం సంపూర్ణతాంయాతినద్యోవందే తమచ్యుతం ॥ పూః నిధానంసంపూర్ణం.

## మథనద్వాదశీవ్రతకథ.

శ్రీకృష్ణఉవాచ ॥ నారదాశేషధర్మజ్ఞలోకానాం హితకారణ । కః యస్త్వమహాభాగవ్రతం దేవర్షిసత్తమ ॥ టీ ॥ శ్రీకృష్ణస్వామి నారదమహా మునినిగూర్చి సకలధర్మజ్ఞుండును మహానుభావుండును దేవర్షిశ్రేష్ఠుండు నైనఓనారదమునీ లోకములకు హితకారణమైన యొకవ్రతమును చెప్పుమః యడుగగానారదుండు పలుకుచున్నాడు. శ్లో ॥ నారదఉవాచ ॥ వ్రతానాము త్తమంపుణ్యంసర్వసౌభాగ్యకారణం । సర్వసంపత్కరంశీఘ్రంపుత్రపౌత్ర ప్రవర్ధనం ॥ ఇషేమాసేసితేపక్షే హ్యేకాదశ్యాముపోషితః । తులసీంచమ హావిష్ణుంపూజయిత్వాసమాహితః ॥ పంచపద్మాన్యలంకృత్య పంచదీపాః ప్రకల్పయేత్ । గంధాద్యక్షతనైవేద్యతాంబూలానిసమర్పయేత్ ॥ ప్రదక్షిణ నమస్కారాః పచంపంచ ప్రకల్పయేత్ । తదాదిమాసపర్యంతం ప్రత్యహంసుసమాచరేత్ ॥ ఊర్జేమాసేసితేపక్షే హ్యేకాదశ్యాముపోషితః । పూర్వవత్తులసీ పూజాంకృత్వానియమపూర్వకం ॥ రాత్రౌ జాగరణం కృత్వాశ్వద్ధశ్యాయ్యాజితేంద్రియః । తతఃప్రభాతవేళాయాం స్నాత్వాశుచి రలంకృతః ॥ కుడుపేనతుపిష్టేనకారయేత్పిష్టికత్రయం । ఏకంతులస్యైదత్వా తుబ్రాహ్మణాయైకమేవచ ।, ఉలూఖలేస్యాత్సంస్థాప్య ఇక్షుమూలేన ఘట్ట యేత్ । యావంతఃక్షీరపృషతాఃస్వశరీరేపతంతిహ । తావంత్యబ్దసహస్రాణి స్వర్గలోకేమహీయతే । టీ, పుణ్యఫలప్రదంబై సకలసౌభాగ్యకారణంబైన కలసంపద్వృద్ధికరంబై పుత్రపౌత్రాభివృద్ధికరంబై వ్రతములలో నెల్లనుత్త మంబైన యొక వ్రతము గలదు, అవ్రతమాచరించు క్రమంబెట్లనిన, ఆశ్వ యుజ శుక్ల పక్షైకాదశినాడు ఉపవాసముగానుండి సమాహిత చిత్తుండై తులసినిశ్రీమహావిష్ణువును బూజచేసి పంచపద్మముల నలంకరించి అయిదు దీపములుపెట్టి గంధపుష్పధూప దీపాదులు సమర్పించి యయిదు విధముల యిననైవేద్యతాంబూలములును అయిచేసి ప్రదక్షిణ నమస్కారములను సమర్పించిఆయాశ్వయుజశుక్లైకాదశి మొదలు నెలదినములవరకు ప్రతిదినము నీరీతిగా పూజచేయుచువచ్చి కార్తీక శుద్ధైకాదశినాడు ఉపవాసముగా నుండి పూర్వోక్తక్రమంబున నియమపూర్వకముగా తులసీపూజచేసిజితేం

ద్రియుడై రాత్రియందు జాగరణముచేసి ద్వాదశినాడు ప్రాతఃకాలమందు స్నానముజేసి పరిశుద్ధుడై శుద్ధవస్త్రాద్యలంకృతుడై యొకమాణికబియ్యపు పిండిచేత మూడు పిష్టికములుగా జేసి యందొకటి తులసికి నైవేద్యమిచ్చి బ్రాహ్మణునకొకటిచ్చి మిగిలినయొకటి రోటిలో వేసి పాలుబోసి చెరుకు గడలచే దంచవలసినదని ఇటుదంచగా నాక్షీరబిందువులెన్ని స్వశరీరమందు పడుచున్నవో అన్ని సంవత్సరములు స్వర్గలోకమందునివసించియుండు రని చెప్పగాశ్రీకృష్ణస్వామియిట్లనియె.

శ్లో॥ శ్రీకృష్ణః॥ పూర్వమాచరితంకైస్తువ్రతమేతత్ఫలైషిభిః। తద్వ్రతాచరణాత్కింవైఫలంప్రాప్తంమహామునే॥ టీ, ఓ నారదుడా యీవ్రతము నెవ్వరాచరించి యేమిఫలముపొందిరిచెప్పుమని యడుగగానారదు డిట్లనియె. నారదః॥ పురాకశ్చిన్మహాతేజోబ్రాహ్మణోభూన్మహాప్రభో। వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో దేవదత్త ఇతిస్మృతః। సకదాచిద్ద్విజశ్రేష్ఠో విచింత్యాస్మీత్యపుత్రకః। ఆరాధయామిదేవేశంకృష్ణంత్రైలోక్యపావనం॥ ఇతిసంచింత్యమనసాతపశ్చక్రేసుదుర్లభం। వృద్ధబ్రాహ్మణరూపేణప్రాదుర్భూత్వాతదంతికే। తపశ్చరంతంతందృష్ట్వావైష్ణుఃప్రాహమహావిభుః। కిమర్థంకృతమార్చర్యంతపోవదమహాద్విజ॥ టీ, మహాప్రభువైన యో శ్రీకృష్ణస్వామీ పూర్వకాలమందు అధికతేజోవంతుడై వేదశాస్త్రతత్త్వజ్ఞుడైనదేవదత్తుడను నొకబ్రాహ్మణుడుగలడు అతడు అపుత్రకుడై యున్నందు వలన లోకత్రయపావనుడైన శ్రీమహావిష్ణువునుగూర్చి తపస్సు చేయ వలెనని యాలోచించి బహుదుర్లభమైన తపస్సుచేయుచుండగా శ్రీ మహావిష్ణువు బ్రాహ్మణరూపుడై అతనియెదుటప్రత్యక్షమైనిలిచి తపస్సుచేయుచున్న ఈ బ్రాహ్మణునిజూచి యెందునిమిత్తము ఇట్టియాశ్చర్యకరమైనతపస్సు చేయుచున్నావనియడిగెను. శ్లో॥ శ్రుత్వాదద్వాక్యమచిరాత్ ప్రణమ్యశిరసాహరిం। దేవదేవజగన్నాథ త్రాహిమాంపురుషోత్తమ। అద్యమేసఫలం జన్మత్వత్పాదాంభోజదర్శనాత్। మదీప్సితంచసఫలంభవిష్యతినసంశయః। అపుత్రకోమహాదుఃఖశ్శరణంత్వాంవ్రజామ్యహం। పుత్రం దేహిమహాదేవ సర్వలోకవరప్రద॥ టీ, అప్పుడు దేవదత్తుండు ఆమాటవిని బ్రాహ్మణ రూపియై ప్రత్యక్షమైయున్న శ్రీమహావిష్ణువునకు దండప్రణామంబు లాచరించి యో దేవదేవ జగన్నాథపురుషోత్తమ నన్నురక్షించుము, ఇప్పుడు మీ యొక్క శ్రీపాదకమలదర్శనములవలన నాజన్మముసఫలమాయెను, నాయభీష్టము సఫలమౌటకు సంశయములేదు, నేను పుత్రహీనుడనై మిమ్ముశరణుబొంది

వాన్నుగనుక సకలలోక వరప్రముఖుడవైన యోస్వామీ నాకు పుత్రుని దయ
చేయవలయునని ప్రార్థించగా శ్రీమహావిష్ణు విప్రునియా నతిచ్చెను.

శ్లో॥ నారాయణ ఉవాచ। ఆయుర్హీనం సుతం వాపి సుతాం వాప్యథభర్తృ
కాం। తయోరేకం వృణీష్వ త్వం దదామి తవ సువ్రత॥ దేవదత్త ఉవాచ। స్వ
గృహం ప్రాప్య భార్యాయా పతిద్వార్తాం నివేద్య చ ఉభయోరేక మిచ్ఛా
మి హ్యేకమిష్యామి కేశవ। ఇతి ప్రణమ్య శిరసా జగామ స్వగృహం ప్రతి। నివే
ద్య సర్వం భార్యాయై బహుధాలోచ్య దంపతీ॥ భార్యోవాచ। సుతా హి
యాద్యతాం స్వామిన్ భర్తృహీనాపి చత్వయా। తథేత్యుక్త్వా స విప్రేంద్రః
పునస్తీర్థం ప్రవిశ్య చ। నారాయణ నమస్తేస్తు పుత్రికాం దాతు మర్హసి। తథే
త్యుక్త్వా మహావిష్ణు రంతర్ధానం యయౌ తదా॥ టీ. ఓ బ్రాహ్మణుడా
ఆయుస్సులేని కొమారునిగాని విధవకాగల కూతురినిగాని నీకుగలుగ జేయు
చున్నాను వీరిలో నెవరు నీ కిష్టమో చెప్పుమని యడుగగా నావిప్రుడు ఇంటికి
పోయి భార్య నడిగి తెలుసుకొని తిరుగా వచ్చి విజ్ఞాపనము చేసుకొను చు
న్నానని చెప్పి తన యింటికి పోయి భార్యతో నాలోచింపగా నామె భర్తృ
హీనురాలై కొమార్తెనే అడుగుమని చెప్పగా తాను ముందు తపస్సుచే
యుచున్న చోటికి వచ్చి శ్రీమన్నారాయణునకు నమస్కరించి కొమార్తెను
యివ్వమని అడుగగా ఆలాగే భర్తృహీనయగు కొమార్తె గలుగు గాక
యని చెప్పి శ్రీ మహావిష్ణువు అంతర్ధానమును బొందెను. శ్లో॥ అస్పృష్ట్వా
త సవిప్రశ్చాగత స్స్వగృహం ప్రతి। కించిత్కాలే వ్యతీతే తు పుత్రికా జా
తా శుభా। సర్వలక్షణసంపన్నా సర్వరోగవివర్జితా। పితుర్గృహే తు సా
కన్యా నర్ధితా చారురూపిణీ। తతః కాలే తు సంప్రాప్తే వివాహ మకరోత్పితా।
జన్మాంతరకృతాత్పాపాజ్జాతా సా వ్యర్థభర్తృకా। జననీ జనకౌ తస్యాస్తత
స్స్వర్గమవాపతుః। తద్గృహే విధవా సాపి సర్వధర్మవివర్జితా॥ నాస్తి
నారాయణేత్యుక్త్వా వదనే సా వ్యర్థభర్తృకా। అతిథిం నార్చయత్యేవ
కదాపి స్వగృహాగతం॥ టీ. పిమ్మట బ్రాహ్మణుడు తనయింటికి వచ్చి కొన్నిది
నములు గడపగానే సకలలక్షణసంపన్నురాలును సకలరోగహీనురాలును
సౌందర్యవతియు నగు కొమార్తె పుట్టి పెరుగుచుండెను, అంతట వివా
హకాలము రాగానే ఆకన్యకను తండ్రి వివాహము చేసెను, పూర్వజన్మకృత
పాపములవలన ఆ చిన్నది శీఘ్రముగానే వైధవ్యమును బొందెను, ఆ తరు
వాతదాని తల్లిదండ్రులు స్వర్గమును పొందిరి, విధవయగు ఆ చిన్నది సకల
ధర్మహీనురాలై తండ్రి యింటనే యుండి యింటికి అతిథులు భిక్షుకులు

ఎవరువచ్చి నను నారాయణ నారాయణ నారాయణయని చెప్పుచు భిక్షమయిన బెట్టక కఠినచిత్తురాలై యుండెను. శ్లో॥ ఏవం కఠిన చిత్తా సా స్థితా నిష్ఠురభాషిణీ। కశ్చిదుచ్చార్యతే సా ధ్యాన్నమన్నామాధవయా తయా। ఇతి తుష్టోఽప్యపి శ్రీశో ద్విజో భూత్వా సమాహితః। తాం వ యాచత విష్ణుశ్చ తద్వచస్సా బ్రవీత్పునః। కాలోపపన్నా సతిథిః కిమర్థం వా వమన్యసే ఇతి బ్రువాణం తం విష్ణుం రుషా లేపాంశుకం దదౌ। తన్మధ్యే బాధకం బీజం దృష్ట్వా హరిరవాపయత్। మృతా కాలేన సా కీటో భూత్వా తత్పూర్ణాభుక్ స్థితా॥

టీ, ఈరీతినుండగా శ్రీమహావిష్ణువు ఈ విధవస్త్రీ కఠినచిత్తురాలై నను ఇడుక నానామమును స్మరింపుచున్నదని సంతోషించి బ్రాహ్మణరూపుడయివచ్చి ఆవిధవస్త్రీని యాచించగా నారాయణ యను మాటనే చెప్పెను. అప్పుడు నారాయణుండు కాలమందు వచ్చిన యతిథుల నేమి నిమిత్తము ఈరీతిగా నవమానింపుచున్నావని చెప్పగా విధవస్త్రీ కోపముతో తాను అలుకుచున్న గుడ్డను బ్రాహ్మణరూపియైవచ్చియున్న యతిథి పాత్ర ముందువేసెను, అప్పుడు నారాయణుండు ఆగుడ్డయందు కందిగింజ యొకటి యుండగా దాన్ని చెట్టు వేసెను, ఆవిధస్త్రీ కొన్ని దినములకు మృతిబొంది పురుగై పుట్టి ఆకందిచెట్టునందన యాకులు తినుచుండెను. శ్లో॥ తతః కదా చిత్తాం స్మృత్వా దేవీం హరిరువాచ వా। ద్రష్టుం యాస్యామి హే దేవి ఏహి నారాయణాభిధాం॥ ఇత్యుక్త్వాథ గతే విష్ణౌ సహ తేన రమా యయౌ। అగత్య కిన్ను భద్రం తే హరిరిత్యవదీన్స తాం॥ కీట ఉవాచ। ఏవం తిష్ఠామి హే దేవ ప్రసిద్ధ జగతీశ్వర। ఇతి ప్రణమ్య శిరసా కీటస్తూష్ణీం స్థిత స్తదా। దేవ్యువాచ। కిమర్థ మేషా కీటోభూద్దేవ దేవ వదస్వ మే। ఇతి పృష్టశ్శ్రియా విష్ణుస్తద్వృత్తాంత మప్రోచత। తచ్ఛ్రుత్వా కమలా దేవీ తన్మోక్షం చాప్యపృచ్ఛత। శ్రీభగవానువాచ। ఊర్జే మాసే సితే పక్షే ద్వాదశ్యాం మస్తు యద్వ్రతం। తద్వ్రతస్య ఫలం కించిద్దాతుమర్హసి శోభనే। ఇత్యుబిందుఫలేనైవ ముచ్యతే పాపబంధనాత్। తథేతి శ్రీర్దదౌ తస్యై కీటోపి స్త్రీత్వమాప్య హి॥ సా ప్రాహ॥ అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవనం। ప్రీతానిసఫలాన్యద్య భవత్పాదాబ్జదర్శనాత్॥ ఇతి స్తుత్వాథ సా నారీ శ్రియం ప్రాహ ముదాయుతా। అహమేతద్వ్రతం దేవి కరిష్యామి వదస్వ మే।

టీ, పిమ్మట శ్రీమహావిష్ణువు ఒకానొకప్పుడు ఆ విధవస్త్రీ స్థితిని దలచి లక్ష్మీదేవినిగూర్చి ఓ దేవీ నారాయణశబ్దము నుచ్చరింపుచున్న దానిని జూచబోదము రమ్మని పిలుచుకొని లక్ష్మీసహితుండై వచ్చి కందిచెట్టునందు

పురుగైయున్నదానిం జూచి చక్కగానున్నావాయని యడుగగా ఆ పురుగు ఓ జగదీశ్వర ఓ ప్రసిద్ధుడైన దేవుడా యీతీరుగానున్నానని చెప్పి యూరక యుండును, అప్పుడు లక్ష్మీదేవి యిది యేందువలన పురుగైనది నాకు జెప్పుమని నారాయణునడిగి దాని వృత్తాంతమంతయు నతనివలన తెలుసుకొని దీనికి ఈ కీటజన్మమెట్లు నివర్తించును చెప్పుమని యడుగగా కార్తీక శుద్ధద్వాదశినాడాచరింపబడు వ్రతము యొక్క ఫలమును కొంచెమిచ్చితి వేని దీనికి ఈ కీటకజన్మవిముక్తి యగునని చెప్పగా లక్ష్మీదేవి యాప్రకారమే యిచ్చెను, అంతట పురుగు స్త్రీరూపమును బొంది లక్ష్మీనారాయణులారా యిప్పుడు మీ పాదకమలం దర్శనమువలన నా జన్మము సఫలమాయెను, నా శ్రుతుకు యోగ్యమైనదాయెను, నా వ్రతములన్నియు సఫలమాయెను, అని స్తోత్రము చేసి, యా స్త్రీ సంతోషముతో గూడుకొన్నదై ఓ శ్రీ మహాలక్ష్మి యీ వ్రతము నేను నాచరించెదను నా కుపదేశము సేయుమమ్మా యని యడుగగా లక్ష్మీదేవియిట్లనియె.

శ్లో, దేవ్యువాచ ॥ కార్తీకేచసితేపక్షే ఏకాదశ్యాముపోష్యచ । తులసీంపూజయిత్వాథపంచవర్ణైశ్చ చూర్ణకైః । పంచపద్మైరలంకృత్య ధూపదీపాదిభిఃక్రమాత్ । రాత్రౌజాగరణంకృత్వా పురాణపఠనాదిభిః । తతఃప్రభాత వేళాయాం స్నాత్వాధృత్వాంబరంశుచి । తులసీం పూర్వవత్పూజ్య కృత్వావైపిష్టకత్రయం । ఏకంతులస్యాఏకంతుబ్రాహ్మణాయనివేదయేత్ । అవశిష్టంతుయచ్చైకంనిధాయోలూఖలేపయః । పోత్యేత్సు సూలైర్నారీసా హన్యాత్పుణ్యాంగనాన్వితా ॥ కీర్తనీయా మహావిష్ణోః కథాస్తల్లగ్నచేతసా । షడ్రసోపేతమన్నంచ దద్యాద్దక్షిణయాసహ । స్వయంచాపిహిభుంజీయాదిష్టకామ్యార్థసిద్ధయే । ఏవంపంచాబ్దపర్యంతమూ కేత్సుసమాహితః । ఆదావంతేచమధ్యేచకుర్యాదుద్యాపనంముదా ॥

టీ, కార్తీకశుక్లైకాదశినాడు ఉపవాసముండి తులసీ బృందావనమును పంచవర్ణపు వ గ్గుల చేతను పందపదములచేతను అలంకరించి ధూపదీపనైవేద్యాదులచే విధ్యుక్తప్రకారముగా తులసినిపూజచేసి యారాత్రియందు పురాణపఠనశ్రవణాదులతో జాగరణము చేసి మఱునాడు ప్రాతఃకాలమందు స్నానము చేసి శుద్ధవస్త్రమును ధరించి పూర్వవత్తుగా తులసీపూజచేసి బియ్యపుపిండిచే మూడు పిష్టకములు చేసి యొకటి తులసికి నైవేద్యము చేసి బ్రాహ్మణునకొకటి యిచ్చి శేషించినయొకటి రోటిలో వేసి కొంచెము పాలుపోసి యనేకసువాసినీ స్త్రీలతోగూడుకొని శ్రీ విష్ణుకథలు

భావించి తదేకాయత్తచిత్తులై వినుచు చెఱకుగడలచేత దంచవలసినది,
శిష్టబ్రాహ్మణులకు దక్షిణతాంబూలములిచ్చి షడ్రసోపేతముగా భక్ష్యభో
జ్యాదులతో గూడ నన్నముపెట్టి తృప్తిచేసి తానును భోజనముచేయవలసి
ది, ఈప్రకారముగా నైదుసంవత్సరములు ఈవ్రతము నాచరింపుచు వ్రతా
రంభమందును అంతమందును ఉద్యాపనముచేయవలసినది. శ్లో॥ కుర్యా
త్ప్రతిమే విష్ణులక్ష్మ్యోర్విత్తానుసారతః। గోమయేనానులిప్యాథ రంగవల్లీం
ప్రకల్పయేత్। తన్మధ్యే పంచకుడుపాన్ సంస్థాప్య శ్వేతతండులాన్। నిక్షిప్య
ప్రతిమాయుగ్మం తత్రనారాయణం రమాం। లక్ష్మీనారాయణం దేవం పూ
జయేద్భక్తిపూర్వకం। అఖండితం నవం వస్త్రమేకైకస్య పృథక్పృథక్॥ గంధ
పుష్పాక్షతైర్ధూపైర్దీపైర్నైవేద్యసంయుతైః। నానావిధోపచారైశ్చ పూజ
యిత్వా యథావిధి। ప్రదక్షిణప్రణామాంశ్చ పంచపంచక్రమేణతు। రాత్రౌ
జాగరణం కుర్యాత్పురాణపఠనాదిభిః। తతః ప్రభాతవేళాయాం నద్యాం
స్నాత్వా సమాహితః। గృహమాగత్య మేధావీ పునః పూజాం సమాచరేత్।
ఏవం కృత్వా విధిజ్ఞాయ ఆచార్యాయ కుటుంబినే। సుశీలాయ సుశాంతాయ
ప్రతిమాదానమర్పయేత్। సువాసినీద్వయం పంచదశబ్రాహ్మణసత్తమాన్।
తృప్త్వాతుష్టాన్ భోజనాద్యైర్వస్త్రాద్యైశ్చ విశేషతః। బ్రాహ్మణాన్భోజయే
త్పశ్చాత్స్వయం భుంజీత బంధుభిః। ఏవం శక్త్యనుసారేణ విత్తశాఠ్యం నకార
యేత్। సోద్యాపయేద్వ్రతం యస్తు పునః కోటిర్భవిష్యతి। ఏవమాచరితం
యైస్తు సర్వాభీష్టప్రదం వ్రతం। తేషాం భుక్తిశ్చ ముక్తిశ్చ భవత్యత్ర నసంశయః॥

టీ, ఉద్యాపనక్రమంబెట్లనిన లక్ష్మీనారాయణప్రతిమలనువారివారి
శక్త్యనుసారముగా జేయించి భూమిని గోమయముతోనలికి ముగ్గులుపెట్టి
యందైదుమానికల తెల్లబియ్యముపోసి లక్ష్మీనారాయణప్రతిమలనుఅక్కడ
ప్రతిష్ఠించి భక్తిపూర్వముగా ప్రతిములకు వేఱువేఱుగా క్రొత్తవస్త్రములు
గట్టి గంధపుష్పాక్షతలచేతను ధూపదీపనైవేద్యములచేతను నానావిధోప
చారములచేతను నయిదేసి ప్రదక్షిణనమస్కారములచేతను యథావిధిగా
లక్ష్మీనారాయణులను పూజించి ఆరాత్రియందు పురాణశ్రవణాదులచేత
జాగరణము చేయుచు మఱునాడు ప్రాతఃకాలంబున నదియందు స్నాన
ముచేసి యింటికివచ్చి సావధానమనస్కుడై పునఃపూజచేసి శాస్త్రజ్ఞుం
డును కుటుంబముగలవాడును సుస్వభావుండును శాంతుండును నగు ఆచా
ర్యునకు ప్రతిమాదానముచేసి, ఇద్దరుసువాసినులను, పదియైదుగురుబ్రాహ్మ
ణులను వస్త్రాలంకారభోజనాదులచేత సంతుష్టులంగావించి విడువవచ్చి

ద్యుంచెడు బ్రాహ్మణుల భుజియింపజేసి యా వెనుక బంధువులతోగూడ తానును భోజనముచేయవలసినది, ఈ ప్రకారము ధనలుబ్ధులుగా వారివారి శక్త్యనుసారముగా వ్రతోద్యాపనముజేయవలసినది, ఎవరైతేఉద్యాపనము జేయకున్నారో వారు పురుగై పుట్టుదురు, ఈరీతిగా సర్వాభీష్టప్రదమైన యీ వ్రతము నాచరించువారికి భుక్తిముక్తులు నిస్సంశయముగాగలుగును,

శ్లో॥ ఇత్యుక్త్వాథ మహాలక్ష్మీ రంతర్ధానంయయౌతదా। ఏవంక్రమేణసా కన్యా కృత్వావ్రతమనుత్తమం। ఇహభుక్త్వాధికసుఖం మంతేస్వర్గంజగామహ। యేపఠంతిదమాఖ్యానం శృణ్వంతిశ్రద్ధయాన్వితాః। తేసర్వేపాపనిర్ముక్తా యాస్యంతిపరమాంగతిం॥ టీ ఈ ప్రకారముగా లక్ష్మీదేవి ఆ స్త్రీకి వ్రతక్రమమునుదెలియజేసి అంతర్ధానమైపోయెను, ఆ స్త్రీయును ఆ క్రమంబుననే ఈ వ్రతమును ఆచరించి భూలోకమందు సకలసౌఖ్యంబుల ననుభవింపుచుండి యంత్యకాలంబున స్వర్గమును బొందెను, ఈ కథను శ్రద్ధాయుక్తులై చదువువారును వినువారును సకలపాపవిముక్తులై యుత్తమగతినిపొందుదురు. ఇతిభవిష్యోత్తరపురాణే, మథనద్వాదశీ వ్రతకల్పస్సంపూర్ణః.

---

శుభమస్తు.

---

## కేదారేశ్వరవ్రతకల్పారంభః.

శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణంచతుర్భుజం।
ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

ప్రారిప్సమాణస్యకర్మణః నిర్విఘ్నేనపరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాంకరిష్యే ఇతిసంకల్ప్య। షోడశోపచారైఃగణాధిపతి పూజాం కుర్యాత్॥

శుభతిథౌ, శోభనేముహూర్తే. ఆద్యబ్రహ్మణః, ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, అస్మిన్వర్తమానే, వ్యావహారికచాంద్రమానేన, ప్రభవాదిషష్టిసంవత్సరాణాం, మధ్యే, సంవత్సరే,దక్షిణాయనే, శరదృతౌ, ఆశ్వయుజమాసే, కృష్ణపక్షే, శుభతిథౌ. వాసరయుక్తాయాం, శుభ

నక్షత్ర శుభయోగ శుభకరణాద్యనేక గుణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ, అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థసిద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థం, సత్సంతానసౌభాగ్యశుభఫలావాప్త్యర్థం, వర్షేవర్షే ప్రయుక్త కేదారేశ్వర ముద్దిశ్య కేదారేశ్వరప్రీత్యర్థం, భవిష్యోత్తరపురాణకల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే, తదంగత్వేన కలశపూజాం కరిష్యే, కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య కలశస్యోపరిహస్తం నిధాయ ॥ శ్లో ॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః । మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాస్స్మృతాః । కుక్షౌ తు సాగరాస్సర్వే కలశాంబుసమాశ్రితాః । ఆయాంతు దేవపూజార్థం దురితక్షయకారకాః । గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి । నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు । ఏవం కలశపూజాం కృత్వా తతః కేదారేశ్వర పూజామారభేత్ ॥



శూలం డమరుకం చైవ దధానం హస్తయుగ్మకే । కేదారదేవమీశానం ధ్యాయేత్ త్రిపురఘాతినం ॥ ధ్యానం ॥ కైలాసశిఖరే రమ్యే పార్వత్యా సహితప్రభో । ఆగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చంద్రశేఖర ॥ ఆవాహనం ॥ సురాసురశిరోరత్న ప్రదీపితపదాంబుజ । కేదారదేవ మద్దత్త మాసనం ప్రతిగృహ్యతామ్ ॥ ఆసనం సమర్పయామి ॥ గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ । మౌక్తికాసనసంస్థాయ కేదారాయ నమో నమః ॥ పాద్యం సమర్పయామి ॥ అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యా దత్తం మహేశ్వర ॥ ప్రయచ్ఛ మే మనస్తుష్టం భక్తానామిష్టదాయక ॥ అర్ఘ్యం సమర్పయామి ॥ మునిభిర్నారదప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ । కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో ॥ ఆచమనం సమర్పయామి ॥ కేదారదేవ భగవన్ సర్వలోకేశ్వర ప్రభో । మధుపర్కం ప్రదాస్యామి గృహాణ త్వం శుభేనవై ॥ మధుపర్కం ॥ స్నానం పంచామృతం దేవ శ్రితశుద్ధోదకైరపి । గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్ ॥ పంచామృతస్నానం సమర్పయామి ॥ నదీజలసమాయుక్తం మయాదత్తమనుత్తమం । స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తు తే ॥ శుద్ధోదకస్నానం ॥ వస్త్రయుగ్మం సదాశుభ్రం మనోహరమిదం శుభం । దదామి దేవ దేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్ ॥ వస్త్రయుగ్మం సమర్పయామి ॥ స్వర్ణయజ్ఞోపవీతం చ కాంచనం చోత్తరీయకం । రుద్రాక్షమాలయా యుక్తం దదామి స్వీకురు ప్రభో । యజ్ఞోపవీతం ॥ సమస్తగంధద్రవ్యాణాం దేవత్వమసి

న్న భూః । భక్త్యా సమర్పితం ప్రీత్యా మయా గంధాది గృహ్యతాం ॥ గంధాంత్సమర్పయామి ॥ అక్షతోఽసి స్వభావేన భక్తానామక్షతం పరం । దదాసి నాథ మద్దత్తైరక్షతైః ప్రీయతాం భవాన్ ॥ అక్షతాన్ ॥ కల్పవృక్ష ప్రసూనైస్త్వం పూర్వైరభ్యర్చితః సురైః । కుంకుమైః పార్థివైరేభిరిదానీమర్చ్యతాం మయా ॥ పుష్పాణి ॥ తత ఇంద్రాదిలోకపాలపూజాం కుర్యాత్ । శివస్య దక్షిణేభాగే బ్రహ్మణే నమః ॥ ఉత్తరభాగే విష్ణవే నమః । మధ్యే కేదారేశ్వరాయ నమః ॥ అథాంగపూజా । మహేశ్వరాయ నమః । పాదౌ పూజయామి । ఈశ్వరాయ నమః । జంఘే పూజయామి ॥ కామరూపాయ నమః ॥ జానునీ పూజయామి । హరాయ నమః ॥ ఊరూ పూజయామి । త్రిపురాంతకాయ నమః । గుహ్యం పూజయామి । భవాయ నమః । కటిం ॥ గంగాధరాయ నమః ॥ నాభిం పూజయామి ॥ మహాదేవాయ నమః ॥ ఉదరం పూజయామి ॥ పశుపతయే నమః । హృదయం పూజయామి । పినాకినే నమః ॥ హస్తాన్ పూజయామి । శివాయ నమః । భుజౌ పూజయామి ॥ శితికంఠాయ నమః ॥ కంఠం పూజయామి । విరూపాక్షాయ నమః ॥ ముఖం పూజయామి । త్రినేత్రాయ నమః । నేత్రాణి పూజయామి । రుద్రాయ నమః । లలాటం పూజయామి ॥ శర్వాయ నమః ॥ శిరః పూజయామి ॥ చంద్రమౌళయే నమః । మౌళిం పూజయామి । పశుపతయే నమః । సర్వాణ్యంగాని పూజయామి.

—※—

## శివాష్టోత్తరశతనామపూజా.

| | | | |
|---|---|---|---|
| ఓం శివాయ నమః. | ౧ | విష్ణువల్లభాయ నమః. | ౧౩ |
| ఓం మహేశ్వరాయ నమః. | ౨ | శిపివిష్టాయ నమః. | ౧౪ |
| శంభవే నమః | ౩ | అంబికానాథాయ నమః. | ౧౫ |
| పినాకినే నమః. | ౪ | శ్రీకంఠాయ నమః. | ౧౬ |
| శశిశేఖరాయ నమః. | ౫ | భక్తవత్సలాయ నమః. | ౧౭ |
| వామదేవాయ నమః- | ౬ | భవాయ నమః. | ౧౮ |
| విరూపాక్షాయ నమః. | ౭ | శర్వాయ నమః. | ౧౯ |
| కపర్దినే నమః. | ౮ | త్రిలోకేశాయ నమః. | ౨౦ |
| నీలలోహితాయ నమః. | ౯ | శితికంఠాయ నమః. | ౨౧ |
| శంకరాయ నమః. | ౧౦ | శివాప్రియాయ నమః. | ౨౨ |
| శూలపాణయే నమః. | ౧౧ | ఉగ్రాయ నమః. | ౨౩ |
| ఖట్వాంగినే నమః. | ౧౨ | కపాలినే నమః. | ౨౪ |

కామారయేనమః ౨౫
అంధకాసురసూదనాయనమః ౨౬
గంగాధరాయనమః ౨౭
లలాటాక్షాయనమః ౨౮
కాలకాలాయనమః ౨౯
కృపానిధయేనమః ౩౦
భీమాయనమః ౩౧
పరశుహస్తాయనమః ౩౨
మృగపాణయేనమః ౩౩
జటాధరాయనమః ౩౪
కైలాసవాసినేనమః ౩౫
కవచినేనమః ౩౬
కఠోరాయనమః ౩౭
త్రిపురాంతకాయనమః ౩౮
వృషాంకాయనమః ౩౯
వృషభారూఢాయనమః ౪౦
భస్మోద్ధూళితవిగ్రహాయనమః ౪౧
సామప్రియాయనమః ౪౨
స్వరమయాయనమః ౪౩
త్రయీమూర్తయేనమః ౪౪
అనీశ్వరాయనమః ౪౫
సర్వజ్ఞాయనమః ౪౬
పరమాత్మనేనమః ౪౭
సోమసూర్యాగ్నిలోచనాయ ౪౮
హవిషేనమః ౪౯
యజ్ఞమయాయనమః ౫౦
సోమాయనమః ౫౧
పంచవక్త్రాయనమః ౫౨
సదాశివాయనమః ౫౩
విశ్వేశ్వరాయనమః ౫౪
వీరభద్రాయనమః ౫౫
గణనాథాయనమః ౫౬
ప్రజాపతయేనమః ౫౭
హిరణ్యరేతసేనమః ౫౮
దుర్ధర్షాయనమః ౫౯
గిరిశాయనమః ౬౦
గిరీశాయనమః ౬౧
అనఘాయనమః ౬౨
భుజంగభూషణాయనమః ౬౩
భర్గాయనమః ౬౪
గిరిధన్వినేనమః ౬౫
గిరిప్రియాయనమః ౬౬
కృత్తివాససేనమః ౬౭
పురారాతయేనమః ౬౮
భగవతేనమః ౬౯
ప్రమథాధిపాయనమః ౭౦
మృత్యుంజయాయనమః ౭౧
సూక్ష్మతనవేనమః ౭౨
జగద్వ్యాపినేనమః ౭౩
జగద్గురవేనమః ౭౪
వ్యోమకేశాయనమః ౭౫
మహాసేనజనకాయనమః ౭౬
చారువిక్రమాయన.... ౭౭
రుద్రాయనమః ౭౮
భూతపతయేనమః ౭౯
స్థాణవేనమః ౮౦
అహిర్బుధ్న్యాయనమః ౮౧
దిగంబరాయనమః ౮౨
అష్టమూర్తయేనమః ౮౩
అనేకాత్మనేనమః ౮౪
సాత్త్వికాయనమః ౮౫
శుద్ధవిగ్రహాయనమః ౮౬

శాశ్వతాయనమః. ౮౭
ఖండపరశవేనమః. ౮౮
అజాయనమః. ౮౯
పాశవిమోచకాయనమః ౯౦
మృడాయనమః. ౯౧
పశుపతయేనమః. ౯౨
దేవాయనమః. ౯౩
మహాదేవాయనమః. ౯౪
అవ్యయాయనమః ౯౫
ప్రభవేనమః. ౯౬
పూషదంతభిదేనమః. ౯౭
అవ్యగ్రాయనమః. ౯౮
దక్షాధ్వరహరాయనమః. ౯౯
హరాయనమః. ౧౦౦
భగనేత్రభిదేనమః. ౧౦౧
అవ్యక్తాయనమః. ౧౦౨
సహస్రాక్షాయనమః. ౧౦౩
సహస్రపదేనమః. ౧౦౪
అపవర్గప్రదాయనమః. ౧౦౫
అనంతాయనమః. ౧౦౬
తారకాయనమః. ౧౦౭
పరమేశ్వరాయనమః. ౧౦౮

శ్రీకేదారేశ్వరస్వామినే నమః, నానావిధపరిమళ పుష్పాణి పూజయామి ॥ అథసూత్రగ్రంథిపూజా ॥ శివాయనమః, ప్రథమగ్రంధిం పూజయామి ॥ శాంతాయనమః, ద్వితీయగ్రంధింపూజయామి ॥ మహాదేవాయనమః, తృతీయగ్రంధింపూజయామి ॥ వృషభధ్వజాయనమః, చతుర్థగ్రథిం పూజయామి ॥ గౌరీశాయనమః, పంచమగ్రంధిం ॥ రుద్రాయనమః, షష్ఠగ్రంథిం ॥ పశుపతయేనమః, సప్తమగ్రథింపూజయామి ॥ భీమాయనమః, అష్టమగ్రంథిం పూజయామి ॥ త్ర్యంబకాయ నమః ॥ నవమగ్రంథిం పూజయామి ॥ నీలలోహితాయనమః, దశమగ్రంథిం పూజయామి ॥ హరాయనమః, ఏకాదశగ్రంధింపూజయామి ॥ స్మరహరాయనమః ద్వాదశగ్రంథిం పూజయామి ॥ భగాయనమః, త్రయోదశగ్రంథిం పూజయామి ॥ శంభవే నమః, చతుర్దశగ్రంథింపూజయామి ॥ శర్వాయనమః, పంచదశగ్రంథిం పూజయామి ॥ సదాశివాయ నమః, షోడశగ్రంథిం పూజయామి ॥ ఈశ్వరాయనమః, సప్తదశగ్రంథిం ॥ ఉగ్రాయనమః, అష్టాదశ గ్రంథిం ॥ శ్రీకంఠాయనమః, ఏకోనవింశతిగ్రంథిం, నీలకంఠాయనమః, వింశ గ్రంధిం ॥ మృత్యుంజయాయ నమః, ఏకవింశతిగ్రంథిం పూజయామి ॥ శ్లో ॥ దశాంగం ధూపముఖ్యంచహ్యంగారవినివేశితం । ధూపంసుగంధైరుత్పన్నంత్వాంప్రీణయతుశంకర ॥ ధూపం ॥ యోగినాంహృదయేష్వేవజ్ఞాన దీపాంకురోహ్యసి దాహ్యదీపోమయాదత్తో గృహ్యతాంభక్తగౌరవాత్ ॥ దీపం ॥ త్రైలోక్యమపినైవేద్యంనతేతృప్తిస్తథాబహిః। నైవేద్యంభక్తవాత్సల్యాద్గృహ్యతాం త్ర్యంబకత్వయా ॥ నైవేద్యం ॥ నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్క

పళేస్థితం । గృహాణభక్త్యామద్దత్తంతాంబూలంప్రతిగృహ్యతాం ॥ తాంబూ
లం ॥ అర్ఘ్యంగృహాణభగవన్భక్త్యాదత్తంమహేశ్వర । ప్రయచ్ఛమేమన
స్తుష్టింభక్తానామిష్టదాయక । పునరర్ఘ్యం ॥ కర్పూరంచంద్రసంకాశంజ్యో
తిస్సూర్యమివోదితం ॥ భక్త్యాదాస్యామికర్పూరనీరాజనమిదంశివ ॥ నీరా
జనం ॥ భూతేశభువనాధీశసర్వదేవాదిపూజిత । ప్రదక్షిణంకరోమిత్వాంవ్ర
తంమేసఫలంకురు ॥ ప్రదక్షిణం ॥ హరశంభోమహాదేవవిశ్వేశామరవల్లభ ।
శివశంకరసర్వాత్మన్నీలకంఠనమోస్తుతే ॥ నమస్కారం ॥ అభీష్టసిద్ధిం కురు
మేశివావ్యయమహేశ్వర । భక్తానామిష్టదానార్థం మూర్తీకృతకళేబర ॥
ప్రార్థనా ॥ కేదారదేవదేవేశభగవన్నంబికాపతే । ఏకవింశద్దినేతస్మిన్
సూత్రంగృహ్ణామ్యహంప్రభో ॥ సూత్రగ్రహణం ॥ ఆయుశ్చ విద్యాంచత
థాసుఖంచసౌభాగ్యవృద్ధిం కురుదేవదేవ । సంసారఘోరాంబునిధౌ నిమ
గ్నంమాంరక్షకేదార నమోనమస్తే ॥ దోరబంధనం ॥ కేదారఃప్రతిగృహ్ణాతి
కేదారోవైదదాతిచ । కేదారస్తారకస్త్వాభ్యాం కేదారాయనమోనమః ॥
ఉపాయనదానం ॥ కేదారప్రతిమాయస్మాదాజ్యసౌభాగ్యవర్ధనీ ॥ తస్మా
దస్యాఃప్రదానేనమమాస్తుశ్రీరచంచలా ॥ ఇతిప్రతిమాదానమంత్రః ॥

ఇతిపూజావిధానం సంపూర్ణం.



## అథకథా.

సూతఉవాచ ॥ యస్యప్రసాదాద్భువనంత్రియతేసచరాచరం । తం
ప్రణమ్యమహాదేవంభగవంతముమాపతిం ॥ కేదారవ్రతమాహాత్మ్యంసర్వ
కల్యాణకారణం ॥ ప్రవక్ష్యామి జగద్భర్త్రా మునిభిశ్చ పూజితం ॥ ౨ ॥
కృతంశంకరదేహార్ధం దేవ్యాయద్వ్రతచర్యయా । యద్వ్రతంచరతాం
లోకేసంభవంతి విభూతయః ॥ 3 ॥ ఆరోగ్యమాయుఃకీర్తిశ్చ వర్ధంతేశ్వ
ర్యతామిదం । ఏకవింశతివారాన్యశ్చరత్యేతద్వ్రతోత్తమం ॥ ౪ ॥ ఇహాము
త్రచకల్యాణంవిందతిధ్రువముత్తమం । వ్రతంసమాచరన్మర్త్యః సౌభాగ్యం
లభతేమేవచ ॥ ౫ ॥ ఆయుశ్శ్రియంచలభతేశివలోకేమహీయతే । తస్మా
ద్విజోవారాజావావైశ్యోవాశూద్రఏవవా ॥ ౬ ॥ యేచాప్యన్యే నరాః
స్సంయతాః వ్రతముత్తమమ్ ॥ అస్తిపూర్వోత్తరేభాగేపృథివ్యాంధరణీ
ధః ॥ ౭ ॥ కైలాసఇతివిఖ్యాతశ్శ్రీమాన్లోకనమస్కృతః । రాజితైర్వివి
ధైశ్శృంగైస్సర్వరత్నవిచిత్రితైః ॥ ౮ ॥ తటద్గణసమాకీర్ణైర్నిర్ఝరద్భి
రలంకృతైః ॥ నానాద్రుమలతాకీర్ణైర్నానాపుష్పఫలైర్యుతైః ॥ ౯ ॥ నానా

విహఙ్గసంఘుష్టైర్నానానిర్ఝరసంకులైః । సాలైస్తమాలైస్తిలకైర్హిం
తాళైర్వకుళైరపి । ౧౦ ॥ అశోకైః కరకైర్నింబైశ్చందనైర్దేవదారుభిః ।
నారికేళామ్రపనసపున్నాగచంపకైః ॥ ౧౧ ॥ ఏతైశ్చాన్యైశ్చతరు
భిశ్శోభితః పుణ్యకాననైః । ఏతస్య శిఖరే రమ్యే యోగిబృందనిషేవితే ॥ ౧౨ ॥
యక్షకిన్నరగంధర్వసిద్ధవిద్యాధరైర్వృతే । సమాతసలివిశ్వాత్మా పినాకిప్ర
మథైర్వృతః । ౧౩ ॥ అంబికా సహితశ్శ్రీమాన్ సర్వదేవ నమస్కృతః ।
ఏకదా తన్య పర్వంతే రుద్రాణీసహితశ్శివః । ౧౪ ॥ తథా ప్రకుర్వన్ వసతింసు
రాణాం దర్శనం దదౌ । అగ్నిర్వాయుస్తథాదిత్యశ్చంద్రమాస్సహతారకః ।
౧౫ ॥ బ్రహ్మాదయో వసిష్ఠాద్యాస్తే సర్వే తం సిషేవిరే । రంభా తిలోత్తమా చై
స్పహాజన్యా చ మేనకా । ౧౬ । యాశ్చాన్యా దేవవనితాః పరితస్తు పినా
కినం । మాతరశ్చండికాద్యాశ్చ కార్తికేయో గజాననః ॥ ౧౭ ॥ నంద్యా
దయో దేవగణాస్సారూప్య సహితాస్థితాః । ఏవం ప్రవర్తమానాయాం
సభాయాం రుద్రసన్నిధౌ । ౧౮ ॥ నారద ప్రముఖాస్తత్ర గాయకాస్తే నవ్రచ
ణాః । తేషాం ప్రవృత్తే మధురే గీతే సర్వమనోహరే । ౧౯ । వాదిత్ర
గోసంయుక్తాన నృతుశ్చాప్సరో గణాః । తాసామప్సరసాం మధ్యే రంభా
సర్వాంగసుందరీ ॥ ౨౦ । మధురం లాస్యమకరోత్సర్వగీర్వాణసమ్మతం । తత్ర
భృంగిరిటిర్నామ సమయే శివసమ్మతం ॥ ౨౧ ॥ అద్భుతం వికటం నృత్తమకరో
ద్ధరసన్నిధౌ । తత్ర ప్రవర్తతే హాసస్సురాణాం శివయోః పురః ॥ ౨౨ ॥ మహా
కలకలశ్చాసీద్గిరికందరపూరణః । ఏవం ప్రహసనాంతే తు శ్రీమాన్ సర్వేశ్వరో
బ్రవీత్ ॥ ౨౩ ॥ సాధు భృంగిరిటే సమ్యక్కృతం ప్రహసనం త్వయా । ఇత్యు
క్త్వా భగవాంస్తస్మై ప్రసాదమకరోద్విభుః ॥ ౨౪ ॥ హరప్రసాదాత్సప్రీత
స్సురైశ్చ సుబహూకృతః । హరం ప్రదక్షిణీకుర్వన్ వినా దేవీం సమాహితః
౨౫ ॥ ప్రణామమకరోత్తస్మై వినయేన సమన్వితః । తతో దేవ్యబ్రవీద్వాక్య
దేవముద్వీక్ష్య హస్మితా । ౨౬ ॥ మద్భాగం పరిహృత్యాయ సౌకృతవాం
త్ప్రదక్షిణమ్ । ప్రణామస్యాకృతేరస్య కారణం పరమేశ్వర ॥ ౨౭ ॥ బ్రూహి
మేతత్త్వతస్సర్వం శ్రోతుం కౌతూహలం హి మే । తయైవముక్తో భగవాన్
బభాషే శశిశేఖరః ॥ ౨౮ ॥ యోగినోనన్యమంత్వాం పరమార్థవిదః ప్రియే
యే భజంతి ప్రియే త్వాం తు తేషాం నాస్తి ప్రయోజనం । ౨౯ ॥ ఇత్యుక్తా స
మహేశేన తత్యాజ ప్రియమీశ్వరీ । శక్త్యా వినాకృతస్సోపి తత్యాజ గస్త్విషమాం
గభృత్ । ౩౦ । అంబాత్యగస్థి శేషాసౌ నిస్సారా వికటాకవత్ । తతస్తు దే
కుపితాం దేవతాభిః ప్రసాదితా । ౩౧ ॥ జగామ సు కాళేశలాసం వతసేగ

తమాశ్రమం సింహైర్నాగైశ్చ శార్దూలైర్హరిణైశ్చ నిషేవితం ॥ ౩౨ ॥
పన్నగైర్గరుడైశ్చాపి విముక్తాన్యోన్యమత్సరైః । నానాద్రుమలతాకీర్ణం
సేవితం పరమర్షిభిః ॥ ౩౩ ॥ సర్వలోకప్రియకరం సర్వకామఫలప్రదం ।
జ్ఞాతమోపి మహాతేజాస్సమిత్కుశఫలాని చ ॥ ౩౪ ॥ వన్యాని హర్తుమగమద్యో
గ్యాని వనాద్బాహ్యత్యనిగతః । మునిస్తు స్వాశ్రమాభ్యాసే శోభాముద్వీక్ష్య
విస్మితః ॥ ౩౫ ॥ కిమిదం తాపసారణ్యమిదానీం శోభతే భృశమ్ । ఇతి చింతా
సమావిష్టో వివేశ స్వాశ్రమం మునిః ॥ ౩౬ ॥ ప్రవిశ్య పద్మపత్రాక్షీం భవానీం
వీక్ష్య భూషితాం । సోపృచ్ఛదభిపూజ్యైనాం తత్రాగమనకారణమ్ ॥
౩౭ ॥ పృష్టా చ మునినా దేవీ స్వవిషాదస్య కారణం । ఉక్త్వా చ సుఖమాసీనం ప్ర
ణమ్య పునరబ్రవీత్ ॥ ౩౮ ॥ భగవన్ హరదేహార్ధం యాదృశే నాప్త
మయా । తాదృశం మే వ్రతం బ్రూహి యద్భవేద్యోగిసంమతం ॥ ౩౯ ॥
తచ్ఛ్రుత్వాథ మహాతేజా భవాన్యా వాక్యమీరితం । సమీక్ష్య సర్వశాస్త్రాణి
పురాణాని చ సర్వశః ॥ ౪౦ ॥ అభీష్టవరదం చైవ శ్రీమత్కేదారనామకం । ఆచ
చక్షే మునివరో భవాన్యై సువ్రతం మహత్ ॥ ౪౧ ॥ ఆపృష్టా చాబ్రవీద్వా
క్యం వ్రతస్యాస్య విధిక్రమః । కథం కథయ తం దేవ యథాశాస్త్రప్రచోదితమ్ ॥
౪౨ ॥ ఏవం బ్రువాణాం తాం దేవీమువాచ మునిపుంగవః । మాసి భాద్రపదేష్ట
మ్యాం శుక్లపక్షే సమాహితః ॥ ౪౩ ॥ క్షౌమైః కార్పాసకైర్వాపి యథారుచి
సుశోభనైః । హస్తే బద్ధ్వా ప్రతిసరం హ్యేకవింశతితంతుభిః ॥ ౪౪ ॥ ఉపో
ష్య రజనీం తాం తు కృత్వా బ్రాహ్మణభోజనం । తదారభ్య ప్రకర్తవ్యం మహా
వాస్యావధి వ్రతం ॥ ౪౫ ॥ నిత్యం ప్రాతస్సముత్థాయ కృత్వా పూజాం ప్రయ
త్నతః । కేదారదేవపూజాం తు కుర్యాదపి విశేషతః ॥ ౪౬ ॥ శుచి క్షేత్రే శుచిదే
శే తు ధాన్యరాశిం నిధాయ చ । తస్యోపరి నిధాయాథ పూర్ణకుంభం సుశో
భనం ॥ ౪౭ ॥ సంవేష్ట్య సూత్రజాలైశ్చ హ్యేకవింశతిసంఖ్యకైః । క్షౌమే
నవాథవా తేన కార్పాసేనాపి వేష్టయేత్ ॥ ౪౮ ॥ నవరత్నాని వా తస్మిన్
సువర్ణం వా తథా ఫలం । నిధాయ గంధపుష్పాద్యైరర్చయిత్వా యథావిధి ॥
౪౯ ॥ త్రిసప్తసంఖ్యకాన్ దేవి బ్రాహ్మణాన్ వేదపారగాన్ । సమాహూయ
ప్రతిష్ఠాప్య పాదశౌచం విధాయ చ ॥ ౫౦ ॥ పూజయేదథ తాన్ సర్వాన్ పురో
హితపురస్సరాన్ । తతః కేదారదేవస్య కుర్యాదావాహనం పునః ॥ ౫౧ ॥
ఆవాహ్య దేవం తత్రైవ ప్రతిష్ఠాప్య యథావిధి । చందనాగరుకర్పూరకస్తూరి
కుంకుమాదికాన్ ॥ ౫౨ ॥ గంధాంశ్చ వివిధాన్ దేవి పుష్పాణి వివిధాని చ ।
తాంబూలాని విచిత్రాణి వాసాంసి చ నివేదయేత్ ॥ ౫౩ ॥ ధూపైర్దీపైః

విధివద్ధూపదీపాదిభిశ్శివం । గోధూమపిష్టసంక్లృప్తానేకవింశతిసంఖ్యకాన్ ॥
౫౪ ॥ అపూపాన్ సుఘృష్టమన్నంచ పాయసం గుడసంయుతం । దధ్యాజ్యమధు
సంయుక్తమన్నైశ్చ వ్యంజనైర్యుతం ॥ ౫౫ ॥ ఫలైరన్యైశ్చ సంపూర్ణం కదళీఫల
సామగ్రిభిః । సర్వాన్ని వేద్య దేవాయ కృత్వాదాచమనీయకం ॥ ౫౬ ॥ తాం
బూలంచ నివేద్యాథ స్తోత్రం కుర్యాద్యథేప్సితం । కృత్వా దేవస్య పూజాం చ
దేవి కేదారనాయకం ॥ ౫౭ ॥ యథాశక్తి సువర్ణాదిబ్రాహ్మణేభ్యః ప్రదా
య చ । వ్రతం సమాప్య విధివత్ప్రీణయస్వ త్రిలోచనం ॥ ౫౮ ॥ ఇత్యాచచ
క్షే మునిరవ్యథా ర్వా తద్వ్రతైః ప్రీషితా । తతః ప్రీతో మహాదేవస్సర్వతే వగణై
స్సహ । ఆగత్య స్వశరీరార్ధం భవత్యై దాస్యతి స్వయం ॥ ౫౯ ॥ ఏతద్వ్ర
తం సుప్రీత్యా కృత్వా గౌతమభాషితం । యథానిర్దిష్టమృషిణా తథా సర్వం
సమాచరత్ ॥ ౬౦ ॥ తతః ప్రీతమనా భూత్వా భగవాన్ వృషభధ్వజః ।
గత్వా దేవగణైస్సార్ధం స్వదేహార్ధం దదౌ హరః ॥ ౬౧ ॥ తతో భవానీ సు
ప్రీతా శంకరార్ధం సమేత్య చ । దేవం ప్రసాదయామాస లోకానాం హిత
కామ్యయా ॥ ౬౨ ॥ దేవప్రసాదాత్తే లోకే చరంత్వేతద్వ్రతం జనాః । పూ
యిత్వా ప్రార్థనాయాం తే బుద్ధ్వా తత్స్వర్గం సమవాప్నుయాత్ ॥ ౬౩ ॥ ఇతి ప్రసా
దితో దేవ్యా భగవానంబికాసఖః । తథేత్యుక్త్వా సురగణైస్తత్రైవాంతర
ధీయత ॥ ౬౪ ॥ తత్రశ్చిత్రాంగదో నామ గంధర్వశ్శివభక్తిమాన్ । వ్రతచ
ర్యాక్రమం లేభే నందికేశ్వరపార్శ్వతః ॥ ౬౫ ॥ మనుష్యవిషయం ప్రాప్య వ్రత
మేతద్విశాంవ్యహం । ఏవం స తు వినిశ్చిత్య జగామోజ్జయినీం పురీం ॥ ౬౬ ॥
వజ్రదంతాయ విధివద్దౌరాజ్ఞే వ్రతం సుధీః । వ్రతమేతన్మనుష్యాయ సమిహో
న భవత్ప్రభుః ॥ ౬౭ ॥ అథాభూతాం వైశ్యసుతే తస్యాం చ పురి కన్యకే । ఏకాం
పుణ్యవతీం ప్రాహురన్యాం భాగ్యవతీం విదుః ॥ ౬౮ ॥ తే కన్యే పితరం ప్రాప్య
బభాషాతే ప్రియం వచః । మహత్కేదారదేవస్య వ్రతం కర్తుం ప్రసీదనౌ ॥
౬౯ ॥ తాభ్యామేవం నిగదితే పితేత్థం వాక్యమబ్రవీత్ । వత్సే బ్రూతం దరి
ద్రోహం కథమాసాద్య తే మయా ॥ ౭౦ ॥ సామగ్రీ చాస్య నాస్త్యేవ యువా
భ్యాం తద్విముచ్యతాం । ఇతి పిత్రా సమాదిష్టే కన్యే పునరవోచతాం ॥ ౭౧ ॥
అనుజ్ఞాతే త్వయా తాత కర్తుముచ్చావసువ్రత । త్వదనుజ్ఞైవ నియతమావ
యోః పరమం ధనం ॥ ౭౨ ॥ ఇత్యుక్త్వా తేన వైశ్యేన కృతాజ్ఞే అథ కన్యకే ।
కస్మింశ్చిద్రుచిరే దేశే వటవృక్షసమాశ్రితే ॥ ౭౩ ॥ లబ్ధ్వా ప్రతిసరం తత్ర చ క్రి
తేఽర్చాం యథావిధి । ఏతయోర్భక్తిశీలేన తత్సామగ్రీం దదౌ హరః ॥ ౭౪ ॥
వ్రతచర్యాం సమాసాద్య ప్రీతే వై చక్రతుర్వ్రతం । తతః ప్రీతో మహాదేవ

స్సాంబస్సన్నిహితో౽భవత్ ॥ ౭౫ ॥ తతయోః కన్యయోః ప్రీతో రూపవత్యవర
సాందరా । అనంతమాయురైశ్వర్యం దత్వాస్సాంతర్హితో౽భవత్ ॥ ౭౬
అథపుణ్యవతీంవవ్రే రాజావ్యుజ్జయినీపతిః । అపరాంచోళ భూపాలోవ
వ్రే భాగ్యవతీంతథా ॥ ౭౭ ॥ దత్వాత్త జేతదావైశ్యస్సమృద్ధో౽న్వవసత్సు
ఖమ్ । సామ్రాజ్య సంపదంప్రాప్య పుత్రాంల్లబ్ధ్వా మహాజనః ॥ ౭౮ ॥
తేసుతేపితరంహృష్టంచక్రుతేమాతరంచతా । అథభాగ్యవతీకామమైశ్వర్య
మదమోహితా ॥ ౭౯ ॥ కాలేగతేబహుతిథేవ్రతమేతన్ముమోచసా । సౌభా
గ్యహీనాపుత్రేణసహభర్తానివాసితా ॥ ౮౦ ॥ వనసంచార ఖిన్నాహిజ
గామళోబరాలయం । తతఃపుత్రంసమాహూయవాక్యమేతదువాచసా ॥ ౮౧ ॥
ఉజ్జయిన్యాంమమస్వసారమ్యోజ్యేష్ఠాముజ్జయినీపతిః । తాందృష్ట్వా ధనమాదాయ
శీఘ్రమాగచ్ఛపుత్రక ॥ ౮౨ ॥ ఇతిమాతుర్వచఃశ్రుత్వాజగామోజ్జయినీం
పురీం ॥ ౮౩ ॥ గత్వానివేదయామాసపుణ్యవత్యైసపుత్రకః । మాతుర్వివా
సతంగాజ్యాద్వనవాసంచదుస్సహం ॥ ౮౪ ॥ తతఃపుణ్యవతీశ్రుత్వాదదౌ
తస్మైమహద్ధనం । ధనమాదాయసుప్రీతః ప్రయయౌమాతరంప్రతి ॥ ౮౫ ॥
గచ్ఛన్మార్గేహృతస్సోభూద్దేవేనాదృశ్యరూపిణా । పునర్గత్వాభగినీగృ
హం గచ్ఛతేస్తస్యతద్ధనం ॥ ౮౬ ॥ జహారేశో౽జనాద్దైనంనితరాం దీనమా
ననమ్ । గచ్ఛభాగ్యమహేపుత్రమావిషాదంవృథాకృథాః ॥ ౮౭ ॥ అయోగ్యం
భవతో౽ప్యేత ద్వ్రతంమేదరతాంధనం । ఇతిశ్రుత్వావచస్తస్యాః కిమేతదితివి
స్మితః ॥ ౮౮ ॥ పుణ్యవత్యైజగాదైతత్పునర్గత్వాసుతస్తదా । సాతద్వి
జ్ఞాయనిపుణాః కారయామాసతద్వ్రతం ॥ ౮౯ ॥ భగిన్యాచయథాపూర్వం
క్రియతామిత్యువాచహ । వ్రతాంతేధనమాహృత్యగచ్ఛన్పూర్వహృతం
ధనం ॥ ౯౦ ॥ సప్రాప్యతత్రదేకాంతేప్రీతఃస్థిత్వామహానిశం । ఆదాయమ
హాంతంసేనాంగజాశ్వరథసంకులాం ॥ ౯౧ ॥ జగామ కాంచీనగరంపిత్రా
ప్రత్యుద్గతో౽బలీ । తామాప్యపిత్రాచసహితశ్చిరకాలమవర్ధత ॥ ౯౨ ॥ తదా
ప్రభృతిమాతాచచకారవ్రతమాదరాత్ । సచచోళనృపఃప్రీతస్తదాప్రభృ
తిసద్వ్రతం ॥ ౯౩ ॥ యథోక్తేనవిధానేనయఃకరోతీప్సితంలభేత్ । ఇతివ్ర
తస్యమాహాత్మ్యంయేశృణ్వంతి పఠంతివా ॥ ౯౪ ॥ తేషామపి మహాదేవః
ప్రీతో౽భవతిసర్వదా । ఆయుష్కరంపుష్టికరంశ్రీకరంచయశస్కరం ॥ ౯౫ ॥
వ్రతమేతత్సముద్దిష్టంగౌతమేనమహాత్మనా । ఆత్మనోహితమాకాంక్షన్వ్ర
తమేతత్సమాచరేత్ ॥ ౯౬ ॥ మహతీంసంపదంప్రాప్య శివసాయుజ్యమ
శ్నుతే । ఇతిశ్రీస్కాందపురాణోక్త కేదారవ్రతకల్పస్సంపూర్ణః.

కేదారప్రతిమాయస్మాద్రాజ్య సౌభాగ్య వర్థనః। ... ప్రదానేన మమాస్తు శ్రీరచంచలా॥

ఇతి ప్రతిమాదానమంత్రః, మంగళంభవతు.

---

## కేదారేశ్వరవ్రతకథా టీక.



ఎవ్వనియొక్క అనుగ్రహమువలన చరాచరాత్మకంబగు లోకములు సృష్టింపబడినవో అట్టి ఉమాపతియగు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన మహాదేవునినమస్కరించి పూర్వకాలమున ఋషులచేత లోకానుగ్రహార్థముగ కొనియాడఁబడినట్టి సకలశ్రేయస్సాధకంబై యున్న కేదారేశ్వర వ్రతమాహాత్మ్యమును వచించెదనని సూతుండు చెప్పుచున్నాడు ముందే వ్రతమాచరించి పార్వతీదేవిచేత భర్తయగు శ్రీ శంకరుని శరీరార్థము పొందఁబడెనో మరియు వ్రతమనుష్ఠించువారలకు లోకమును సకలసంపదలు గలిగి యారోగ్యైశ్వర్యములు వృద్ధిఁబొందుచున్నవో యట్టి వ్రతమాహాత్మ్యమును ఎల్లవారును వినవలయు నెవ్వఁడయిన నిట్టి సర్వోత్తమంబైన వ్రతమును కల్పోక్తప్రకారంబుగ నిరువదియొక్కమారు లాచరించిన యెడల నెల్లప్పుడు నిశ్చయముగ సకలకల్యాణభాజనుండై యుండును మరియు నీ వ్రతమును మనుష్యులలో నెవ్వరైన యథాక్రమముగ నాచరించిరేనివారలు కాంతి సౌభాగ్యాదిసంపదలనుభవించి పిమ్మట శివలోకమందు మాననీయులై యుందురుగాన నీ వ్రతము ధర్మాది పురుషార్థచతుష్టయ సాధకంబగుటం జేసి, బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు మొదలైన సజ్జనులందరు దీనిం భక్తియుక్తులై నిరువమతో నాచరింపవలయును దీని మాహాత్మ్యమెట్టిదనిన పృథివియందీశాన్యభాగమున మెఱుపుగుంపులతోఁగూడియున్న శరత్కాలమేఘములంబోలుచు నిఖిలమణి విచిత్రితంబైన శిఖరముల చేతను బలుదెరంగులైన లతావిశేషముల చేతను బహువిధంబులగు పుష్పఫలాదులచేతను నానావిధములైన పక్షుల చేతను మరియు ననేకములైన కొండకాలువ చేతను వ్యాప్తంబై సాల తమాల తిలకహింతాల వకుళాశోక చందన దేవదారు నారికేళామ్రపనసపూగ పున్నాగ చంపకాదివృక్షముల చేతను నిండియుండుగాక నానాతరువిశేషముల చేత భాసిల్లునట్టి యుద్యానవనముల చేత బ్రకాశించుచు నిఖిలకల్యాణప్రదంబై సర్వజన నమస్కృతంబై కైలాసంబనిపేరొనఁగినయొక్క పర్వతశ్రేష్ఠము గలదందు షడ్గుణైశ్వర్యసంపన్నులును

# కేదారేశ్వర వ్రత కథ

సహనీయులగు యోగులచేతను సిద్ధగంధర్వ కిన్నర కింపురుషాదుల చేతను సేవింపబడి మనోహరంబై యున్న యా పర్వత శిఖరమందు జగత్కర్తయైన పరమేశ్వరుడు ప్రమథగణముల చేబరివేష్టింపబడి భవానీసమేతుండై సకలదేవముని బృందములచేత నమస్కరింపబడుచుండి ప్రసన్నుడై కూర్చుండి యొక సమయంబున చతుర్ముఖాది సురులకందరికి దర్శనమిచ్చె నంత సూర్యాగ్నిపవనులు నక్షత్రయుక్తుడైన నిశాకరుండును మరియు ఇంద్రాది దేవతలును వసిష్ఠాది మహర్షులును రంభ మొదలగు దేవతాస్త్రీలును బ్రాహ్మీ మొదలగు సప్తమాతృకలును సేనానియు గణపతియును తత్సారూప్యమును బొందియున్న నందిభృంగి మొదలగు ప్రమథగణములును తన్ను పరివేష్టించి కొలుచుచుండ నిట్టి భవానీవల్లభుని యత్యద్భుతంబగు సభయందు నారదుడు మొదలగు దేవగాయకులా స్వామియనుజ్ఞవడసి గానముచేసి రట్టి రమణీయంబై శ్రావ్యంబగు గానము ప్రవర్తిల్లుచుండగా ఘృతాచీ మేనకాదులు వీణాదిచతుర్విధవాద్యములలయలతో గూడిన నృత్యమొనర్చి రప్పుడా వేల్పుబానిసెలలోపల మిగుల సొగసుకత్తెయగు రంభ నిఖిలసుర బృందముల యొక్క యుల్లములు రంజిల్లునటుల విశేష నాట్యమొనరించె, ఆ సమయంబున భృంగిరిటయని భక్తవరుండా స్వామి సన్నిధియందు తత్ప్రీతికరంబగు వికటనాట్యము చేయగా నా పార్వతికైలాసాధిపతి యొక్క పూర్వభాగమునందు నిఖిల దేవతలకు మిక్కుటమైన హాసము జనించె నట్టి యాశ్చర్యకరంబగు హాసమువలన నప్పుడా పర్వతగుహలు నిండునటుల గొప్ప కలకలధ్వనిగలిగె నిట్లు హాసము విస్తరిల్లుచుండ సర్వేశ్వరుండగు శంకరుండా భృంగిరిటినింజూచి నీ చేత మిగుల హాస్యప్రవర్ధకంబైన నాట్యము జేయబడెనని సెలవిచ్చి ముదరంబున [illegible] స్తుతియందను గ్రహించె నంతట నా భృంగిరిటికి శివానుగ్రహంబులు గలుగుటం జేసి యుఱుందు ప్రీతుండైన కవి విబుధుల చేత గ[illegible] సమాహితచిత్తుడై వినయముతో గూడి యా పార్వతీదేవిని విడలి యీశ్వరునికి మాత్రము ప్రదక్షిణమొనర్చుచు నా స్వామికి వందనమాచరించె నప్పుడు అప్పూజ్యురాలగు మృడానియు చిఱునవ్వుతో గూడిన దైవభర్తయగు నప్పరమేశ్వరునుద్దేశించి యో స్వామీ యీ భృంగిరిటి నన్ను విడిచి మీకు మాత్రము ప్రదక్షిణంబాచరించుటకు గారణం బేమి విన వేడుకై యున్నది యానతీయ వేడుదునని వేడగా నా శశిశేఖరుండో ప్రియురాలా చెప్పెద వినుము.

పరమార్థ విదులగు యోగులకు నీవలనం బ్రయోజనంబు లేమిం జేసి

ఋశ్రీగంధమును నానావిధపుష్పములను తాంబూలమును వస్త్రములను నివి
వేదన మొనరించిరి. యథాశాస్త్రముగ ధూపదీపాదులచేత పూజించి యనేకవిం
ప్రసంఖ్యాకదండంబు వగు పూపములను పాయసమును షడ్రసోపేతంబులైన
భక్ష్యలేహ్యాదులను కదళీవనన మామిడిఫలములను నైవేద్యము చేసి తాంబూ
ములొసంగి చక్కగా స్తోత్రము జేసి బ్రాహ్మణులకు యథాశక్తి దక్షిణ లిచ్చి
తమను లెస్సగా ననుష్ఠించి ఈశ్వరునకు సంతుష్టి చేసిరి. యట్టుల ప్రీతుం
డు యా వృషభధ్వజుండు సంతుష్టాంతరంగుడై యప్పటికి [illegible]బుల
డంజని స్వశరీరార్ధము నీకిచ్చెదనని యివ్వగా నప్పార్వతిదేవియు పొంది
శంకరదేహార్ధమును బొంది లోకానుగ్రహము జేయదలంచి భర్తయగు
శ్వరునితో నీ వ్రతము నాచరించువారలకు నిఖిలాభీష్టసిద్ధి గలుగునట్లు
ననుగ్రహించితి రేని యెల్లవారు నాచరింతురనగా నట్లుగాక యని యంగీ
కరించి సురసంఘములతోగూడ నచ్చట నంతర్హితుండయ్యె. మఱికొంత
కాలంబునకు శివభక్తియుక్తుండగు చిత్రాంగదుడను గంధర్వుండు నంది
కేశ్వరునివలన నా వ్రతచర్యాక్రమంబెఱింగి మనుష్యలోకమునకు
వచ్చి [illegible]కుపదేశింపవలయునను నిచ్ఛగలవాడై యుజ్జయినిపట్టణమును పొంది
[illegible] తుండను రాజునకుపదేశింప నతండు ఆ వ్రతమును కలో[illegible]
బుగ నాచరించి సార్వభౌముండాయెను.

మఱికొంతకాలమునకు నా పట్టణంబున నొక్క వైశ్యునకు పుణ్యవతి
యనియు భాగ్యవతియనియు నిద్దరుకొమార్తెలు గలిగిరి వారిద్దరును
తండ్రి యొద్దకుం బోయి కేదారవ్రత మాచరించు నట్లాజ్ఞ యొసంగుమని
యడుగగా నేను మిగుల దరిద్రుడను దానికి వలయు సామగ్రి లేమి జేసి యీ
కల్పంబుమానుడనగా ఓయి తండ్రీ నీ యనుజ్ఞయె మాకు పరమధనంబు
న నాజ్ఞ యొసంగుమని సెలవుబుచ్చుకొని [illegible] వటవృక్షమూలంబున
కూర్చుండి ప్రతిసరము గట్టికొని యథావిధిగా పూజించువారల భక్తికి మెచ్చి
యీశ్వరుండప్పుడు వలయు సామగ్రి నిచ్చెను, అంతట వారలు చక్కగా
వ్రతము నాచరించుటవలన నమ్మహాదేవుండు ప్రీతుండై యక్కన్యలకా
రారోగ్యైశ్వర్యములను దివ్యరూపంబు నొసంగి యంతర్హితుం
డయ్యె, పిమ్మట నా వ్రతమాహాత్మ్యమువలన నుజ్జయినీ పట్టణమేలుచున్న
రాజు పుణ్యవతియను నొక కన్యను చోళభూపాలుడు భాగ్యవతియను
కన్యను పాణిగ్రహణ మొనరించి రందువలన నా వైశ్యుండు ధనసమృ
ద్ధుడై సామ్రాజ్య సంపదలను పుత్రులను బొంది సుఖంబుననుండె, నంత

# కేదారేశ్వర వ్రతకథ

వాళ్లిలో విడవఁబడినదైన భాగ్యవతియను నది యైశ్వర్యమదమోహితులరా లయి కొంతకాలమునకు నా వ్రతమును విడిచెను, అందువలన భాగ్యహీను లాలయి పుత్రునితోఁగూడ పరిమితిచేత వెడలనంపబడి యడవిదిరిగి సు చారుస్సన్నరాత్రి [illegible] బోయవానియిల్లు జేరి యచ్చట పుత్రుఁజూచి యా పుత్రునితో నా యక్కయగు పుణ్యవతిని యుజ్జయినీ పట్టణపురాజు భార్య గా మైయున్నవాడు నీ వచ్చటికింజని దానింజూచి ధనము దీసుకొని శీఘ్రి ముగ రమ్మనగా నతఁ డాపట్టణమునకుఁబోయి పెద్దతల్లితో తనతల్లియొక్క దుస్సహంబగు కష్టమును దెలుపగా నా పుణ్యవతియు నతనిచేతికి విస్తార ముగ ధనమునిచ్చె నంత యతండాధనము దీసికొని వచ్చునెడల మార్గమం బున నప్పరమేశ్వరుఁ [illegible] యద్దేవునివలన నా ధనంబపహరింపబడెగా నతండును మరల నచటికేతెంచి యావృత్తాంతము విన్నవించ మరికొంతధనమ సంగ్రహించుకొని రాగా నా ధనమును గూడ హరించగా దుఃఖము మానస పుత్రి పిలుపబడియున్న వానితో నీశ్వరుం డదృశ్యుండై రూపుచే వ్రతాచరణ నష్టులు [illegible] ధనంబు గ్రహింప నలవిగాదని చెప్పగా నా వృత్తమునంతయు విస్మయంబంది యా చిన్నవాడు మరల పూర్వమువలె నచటికే తెంచి తల్లికి వృత్తాంతమును దెలుపగా నా పుణ్యవతి యతని -చి చి పుత్రుని చేత వ్రతంబొనరింపజేసి తనచెల్లెలు వ్రతమాచరించునట్టు చెప్పవలయు ద్రవ్యము నొసంగిపంపగా నతండు బయలు వెడలివచ్చు నెడ మార్గంబున నపహరించినవన్నియుఁ బూర్వము గోనిపోయిన ధనమంతయు ప్రత్యక్షమైనందున సంతసించి సర్వము గ్రహించుకొని కాంచీపట్టణమును బ్రవే శించు నప్పుడు [illegible] చతురంగబలములతోడ తనతండ్రి యెదుర్కొ వచ్చి [illegible] జనియె నంతట తల్లిదండ్రులతోఁగూ సుఖంబుల [illegible] ట తల్లియగు పుణ్యవతియను తండ్రి యగు [illegible] వ్రతము నాచరించుచు నవిచ్ఛిన్నంబగు నిఖిలసంపదల [illegible] గాన, నెవ్వారైనను యథోక్త ప్రకారమ నీ వ్రతమాహాత్మ్యమును భక్తియుక్తులై వినినం జదివిననట్టివారలందరును శ్రీ మహాదేవుని యనుగ్రహమువలన ననంతంబులగు నాయురారోగ్య యశములను బొంది సుఖంబులనుభవించి శివసాయుజ్యమును బొందుదుర గౌతమమహర్షిచే జెప్పంబడెనని సూతుండు శౌనకాదులకుం జెప్పినట్లు శ్రీ వ్యాసభట్టారకుండు స్కాందపురాణమునందు వివరించెనుట.

దారేశ్వరవ్రతకల్పము సంపూర్ణము.